సంపుటము 5] జూలై, 1918 [సంచిక 1

# బాలమిత్ర



## ఎఱ్ఱ సిలువ జెండా

బెల్జియందేశములో ఒక యుద్ధమైన తరువాత, సైన్యమునుండి తప్పిపోయిన వారిని వెదకి కూర్చుటకొక ఇంగ్లీషు నాయకుని నియమించి ఆ స్థలమువిడిచి సైన్యాధిపతి వెళ్లి

పోయెను. ఆ నాయకుడు దక్కడక్కడ తిరుగుచు చివరకు ఆ పట్టణములో ప్రస్తుతమునకు మాత్రము ఆసుపత్రిగా నేర్పాటు జేయబడిన ఒక మ్యునిసిపల్ కట్టడమునకు వచ్చెను.

"యుద్ధమునకు రాగల భటులెవరైన నిచ్చట గలరా?" యని అతడు అడుగ నారంభించెను గాని తీవ్రమగు గాయములపొంది, చనిపోబోవుచున్న యనేక బాధితులు మాత్రమే యతనికి కనుబడిరి. అతనికన్ను లేదిక్కునకు తిప్పినను దురవస్థలోనున్నవారే యగుపడిరి. వాని చెవులు మూల్గులతోను ముక్కులతోను నిండిపోయెను. ఇంతలో బుంయ్‌మని ఒక ఫిరంగిగుండు వారున్న యింటిమీదుగావెళ్లి దగ్గరనున్న ఒక గృహముమీదబడి, ఢాంమని పగిలి వెయ్యిముక్కలై ఆ యింటినికూల్చి పేరులేకుండ జేసెను. అంతటను నిశ్శబ్దమాయెను. సూదిపడినను వినవచ్చునట్లుండెను. కొంచెముసేపటికి అక్కడనున్న భటులలో నొకడునవ్వి, "వానిలోకొన్ని యిక్కడ పడినయెడల డాక్టరులకు పనియుండదు. వారుచేసెడు శస్త్రములు వ్యర్థమేగదా!" అనెను.

అక్కడనున్న నర్సుల పైయధికారి చనిపోవుచున్న యొకని తలయెత్తి చేతులతో పట్టుకొనియుండెను. అతడామెతో "అమ్మా! ఎట్టిని శిలువపై వారు ఫిరంగుల కాల్చరు గదా!" అని యడిగెను.

ఆమె "అయ్యా నీవు వచ్చిన తొందర లేదు. ఆ జెండా క్రిందనున్న వారందరు క్షేమముగానుందురు. నీవు పండు కొనుమని" చెప్పెను. తరువాత తన కన్నులెత్తి, ఆ యింగ్లీషు నాయకుని యొద్దకు క్షణములో బోయి, "అయ్యా! మీరు వెళ్లకుడు. నాకు సహాయము కావలెను" అనెను. "నావలన యేమికాగలదు?" అని అతడనెను.

"ఇదిగో విను. ఒక క్షణమైనను అలస్యము చేయవద్దు. ఈ కట్టడముపై జెండా లేదు. తెలిసినదా? ఎర్రశిలువ జెండా లేనేలేదు. జనులు పట్టణము పాడుచేయ మొదలు బెట్టినారు. నా కా ఎర్రశిలువ జెండా తెచ్చి, ఇంటిపై కట్టుము" అని ఆమె చెప్పెను.

"అయ్యో నా యొద్దలేదే! ఎక్కడదొరుకునో తెలియదే"

"ఒకటిచేసి పెట్టలేవా"

వానికండ్లు నేలవైపు తిరిగెను. ముఖము వెలవెలపోయెను. అతడు వెనుకదీసినట్లు కనుబడెను. కొంచెము సేపటికి, "నాకొక దుప్పటిని కొన్ని బట్టపేలికలు తెమ్ము" అని వాడు చెప్పెను.

అతడా దుప్పటిని నేలపై పరచెను. ఒక చేతితో ఆ పేలికలను పట్టుకొని, నేలపై పారుచున్న రక్తమునందు వాటిని

ముంచెను. చనిపోవువారందరు నెమ్మదిగా అతడు చేయుచున్న జండాను కనిపెట్టిరి. కొందరి ముఖములు చిరునవ్వుతో వికసించెను. అక్కడ నిలువబడిన నర్సు పైకి పొరలివచ్చుచున్న దుఃఖము నాపుకొని, ధైర్యముతో వారివంక జూచెను.

ఆ నాయకుడు పేలికల నాదుప్పటికి గట్టిగా కట్టి, ఒక కర్రకు తగిలించి యింటిపైకి ఎత్తెను. కొంచెముసేపటిలో గాలికొట్టి ఆ జెండా విప్పి, అటు యిటు ఊపెను, ఎర్రని శిలువ స్పష్టముగాను చాలదూరమున నున్నవారికిగూడ కనుపడునట్లు ఎండలో ప్రకాశించెను.

గుండ్లంతో తీవ్రముగా పట్టణముపై పడుచుండెను. గాని ఈ జెండాక్రిందనున్న కట్టడముపై దానిలోనివారి ఎర్రని రక్తముతో చేయుబడిన శిలువ కనుపడుచున్నందున దాని క్రిందనున్నవారు క్షేమముగాను నిరపాయకరమగు స్థితిలోనుండిరి.

---

# పుష్పములు, వాని ప్రయోజనములు



చాయ. మత్తకోకిల స్వరము ననుసరించి పాడఁదగినది

పల్లవి

ఎన్నియో యుపయోగములను - క్రన్నన దెల్పెదను
సన్నుతించుచు యెహోవ - సదమలంబగు నామమున్ ‖ ఎన్నియో ‖

1. పలువిధంబులైన పూలు - వెలయుచున్నవి యీధరన్
విలువగు పన్నీరు నత్తరు - వీనివలనఁ గల్గును ‖ ఎన్నియో ‖

2, వివిధవర్ణ విరాజితంబై - వినులమై నేత్రములను
విందునై మనోహరంబగు - పరిమళంబుల నిచ్చును || ఎన్నియో ||

3. మధురమై నిర్మలమునై - మనుజాళికి నుపయోగమే
మక్షికంబుల తేనెకున్నివి - ముఖ్య కారణంబులు || ఎన్నియో ||

4. గృహముల నలంకరింప - గృహిణులెల్ల వీనిని
బహుగ గోరుచుందురహహ - బహు విచిత్రమైనవి || ఎన్నియో ||

5. బాలికలు దివ్యమైన - పూలను ప్రేమింతురు
చాల ప్రీతి జడలవాని - మాలికల ధరింతురు || ఎన్నియో ||

6. పరిణయ ముహూర్తములలో - పరిమళద్రవ్యములివి
మరణమైన వారి కాయ - ముల నలంకరించును || ఎన్నియో ||

---

# దేవుని చూచుట

"హృదయశుద్ధిగలవారు ధన్యులు, వారు దేవునిచూతురు" మత్తయి 5 : 8.

సూర్యుడు అప్పుడే ఉదయించుచుండెను. ఆకాశమంతయు చక్కని రంగులతోగూడి మనోహరముగా నుండెను. జనులు ఆ దిక్కు చూచి "దేవుడు భూమిని వేడిజేయుటకును, మనకు వెలుగునిచ్చుటకు సూర్యుని పంపుచున్నాడని" చెప్పుకొనిరి. సూర్య కిరణములవంక చూచినప్పుడెల్లను ఆయన

ప్రేమనుగూర్చి మంచితనమును గూర్చి తలంచుచు, పండ్లను కాయలు పండునట్లును, పువ్వులు వికసించునట్లును ధాన్యము పండునట్లును ఆయన వాటి నంపుచున్నాడని వారనుకొనిరి.

ఎండ ఎక్కువై చల్లనిగాలి వీచినప్పుడు "వాయువు శుభ్రమైనదై మంచివాసనతో గూడియుండునట్లు దేవుడు గాలిని పంపుచున్నాడని" జనులు చెప్పుకొనిరి. ఆ గాలి వారి ముఖములపై చల్లగా వీచినప్పుడు పరలోకమునుండి వచ్చు శ్వాసమువలెనున్నట్లు వారికి తోచెను.

భూమియావత్తును అందంబుగానాయెను. గడ్డిపోచలనుండి పెద్దపెద్ద మర్రిచెట్లవరకు బహుచక్కగా కనుపడెను. "ఎంత చక్కదనము వచ్చునట్లు దేవుడు చేయుచున్నాడు ఆయనెంత మంచివాడు!" అని జనులుచెప్పిరి. ఘుమఘుమ వాసననిచ్చు మల్లెలును, మంచి చేమంతులును, బంతిచెట్లును, ఇతరమొక్కలును భూమి నలంకరించినప్పుడు అవి దేవుని గూర్చి తెలియ చేయుచున్నట్లగుపడెను.

పువ్వులు మాత్రముగాక మామిడి, జామ అరటి నారింజ మొదలగు మంచిమంచి పండ్లు పండుతోటలును, బెండకాయ, చిక్కుడుగాయలు, గుమ్మడి, వంకాయలు కాయు తోటలును, భూమిపైన ఎక్కడజూచిన నక్కడ లెక్కలేకుండనుండెను.

వానిలోని ఫలములను తిని సంతోషించుచునప్పుడు వారు దేవునిస్తుతించి ఆయనకు కృతజ్ఞత తెలిపిరి.

ఒకరికొకరు మేలుజేసినప్పుడు వారు "మనుష్యుడు తన పొరుగు వారియెడల దయగలిగి ప్రేమతోనుండునట్లు దేవుడు తన ప్రేమను వానిహృదయములో నుంచియున్నాడ"ని చెప్పుకొనిరి.

పగలు గతించి, చీకటిపడి, నక్షత్రములు మిణుకు మిణుకుమని ప్రకాశించునప్పుడు అవికూడ తమవలెనే దేవుడును మనుష్యులను చూచుచు కాపాడుచున్నాడని జ్ఞప్తిజేయుచున్నవి.

దేవుడు మన కనుగ్రహించిన ఇంత మంచిలోకములో జీవించునప్పుడు మనకండ్లు దేవుని జూడజాలవు. గాని ప్రతి వస్తువుద్వారా ఆయన ప్రేమనుజూచి తెలిసికొనుచున్నాము. ఇది దేవునిజూచుట కొకమార్గము. మనహృదయములు పవిత్రములును మంచివియు ప్రేమగలవియునైన యెడల ఈ లోకములో ప్రతివస్తువుద్వారా దేవుని జూడగలము.

---

# శాకముల వలస



సీమ తోటకూర జర్మనిలో నుత్పత్తియాయెను. బాదముకాయ ఇతాలియనుండి వచ్చెను. ఉల్లిపాయలు ఐగుప్తులో ప్రారంభమాయెను. పొగాకు వర్జినియాలో నుత్పత్తియాయెను. దబ్బకాయ గ్రీసుదేశమున జనియించెను. ఓటుధాన్యము ఉత్తరమెరికానుండి తేబడెను. గసగసాలు తూర్పుదేశములందు పుట్టెను. సీమరేగుపండ్లు ఐరోపాలో నుత్పత్తియయ్యెను. బచ్చలికూర అరాబియాలో

నారంభమాయెను. ప్రాద్దుతిరుగుడు పువ్వు పెరుదేశము నుండి వచ్చెను. మల్బెరిచెట్టు పారసీకమున జనియించెను. సీమ గుమ్మడికాయ తూర్పుదేశములందు పుట్టెను. దోస కాయలు తూర్పిండియా దీవులలో నుత్పత్తియయ్యెను. మునగ కాయ చీనానుండి తేబడియెను. బటానీలు ఐగుప్తులో ప్రారంభమాయెను.

---

## పోయిన ఉత్తరములు

ఒక్క ఇంగ్లాండు రాజ్యమునందుమాత్రము 1914 మార్చితో అంతమగు సంవత్సరమున 1,50,00000 ఉత్తరములును, 1,50 లక్షల ప్యాకెట్లును 3 లక్షల పార్సెలులును ఎక్కడపోయినవో యెరుగము. ఇండియాదేశమునం దెన్నియో తెలియదు. గాని సంఖ్యమాత్రము చిన్నదిగాదు. వీనిలో ఈ నెక్కువభాగము సరియైన విలాసము వ్రాయకపోవుట వలననే జరిగినది. వాటిని రవాణాచేయువారి లోపమని తప్పక యనవలెను. సరియైనరీతిగా విలాసమును వ్రాసిన యెడల అందునవే కొన్నిటికి విలాసముండదు. కొన్నిటికి సరిగానుండదు. మరి కొన్నిటికి తప్పువిలాసము వ్రాయు



బడును. మరి కొన్నిటికి విలాసము బిక్కిరి బిక్కిరిగా వ్రాతురు.

పోస్టాఫీసులో పనిచేయువారికి బహు గొప్పపనియుండును. ఒక్క ఉత్తరమున కొక్క సెకండుకంటె నెక్కువకాలము గడుపరు. గాన నీవు నీ ఉత్తరము మీదివిలాసము సరిగా వ్రాసినయెడల ఎంతో శ్రమను తగ్గించువాడ వగుదువు.

### ఉత్తరముల పైవిలాసము వ్రాయుట

1. స్పష్టముగాను పెద్దవిగాను వ్రాయుము.
2. సరియైన పైవిలాసము వ్రాయుము, పాతవాని నుపయోగింపకుము.

3. సరియైన కవరు నుపయోగించుము. చిన్న ఉత్తరము ఒక టావు కాగితము పెట్టి చేసినకవరులో పెట్టకుము.

4. కవరులో సరిగా పట్టునట్లు మడుపుము.

5. కవరును మూయునప్పుడు జిగురు ఉత్తరమున కంటు కొనకుండునట్లు చూడుము.

6. కవరు వెనుకభాగమున సగమునకుపైగా విలాసము వ్రాయకుము.

7. విలాసము ఎడమఅంచు దగ్గరగా వ్రాయ నారంభించకుము.

8. రెండవ పంక్తిని మొదటిదానికి కొంచెము కుడిగాను, మూడవ పంక్తిని రెండవదానికి కొంచెము కుడిగాను వ్రాయుము.

9. పంక్తులను మరీదగ్గరగా వ్రాయరాదు.

10. సరిగా విలాసము వ్రాయబడెనో లేదో యని మరియొకసారి చదువుము.

# ఆ చిన్నపిల్లవాఁ డెవఁడు?

నాకొక పిల్లవాఁడు తెలియును, వాని పేరు చెప్పను. మీ కందఱకు తెలియును, ఆడుకొనునప్పుడు ఎంతో చురుకుగా నుండును. ఎంత పెద్దబరువైనను మోయగలఁడు, ఎంత పెద్ద చక్రమునైనను దొర్లింపగలఁడు. తమాషాలు జరుగునప్పుడు, అటుయిటు చకచకఁ షికారు జేయును. ఎక్కడఁ జూచినను, తానే కనుపడును. అట్టి సమయములలో వానికంత ఉషారును, బలమును ఎక్కడనుంచివచ్చునో నాకు తెలియదు, గాని వానితండ్రి ఏమైనా కొంచెము పనిచెప్పినయెడలను, తల్లి బజారుకుపోయి కొంచెముకూర తెమ్మన్నయెడలను, వాని బలమంతయు పోయినట్లు కనుబడును. అప్పుడు వానికంటె బలహీనుఁడు మఱియొకఁడుగాని రాఁడు. వీఁడింతబలహీనుఁడు మఱియొకఁడు గలఁడాయని తోఁచును. ఆ పిల్లవాఁడెవరో తెలియునా? కనుక్కొండి! చూతము.

# ప్రకృతి పాఠములు

45 వ పాఠము



జంతువులు చేతికి ప్రతిగా నుపయోగించు సాధనములు

(గతసంచిక శేషము)

జంతువులకు చేతులు లేకపోయినను, మనము చేతితో చేయు పనులకుగాను అవి ఆయా అవయవముల నుపయోగించును.

ఈ కుక్కను చూడుము. దీనినోటిలో నున్నదానిని ఎంత గట్టిగా పట్టుకొనియున్నది! అది చేతికిబదులుగా తన పండ్ల నుపయోగించుచున్నది. కుక్క లేవయినా వస్తువులను పట్టుకొనిపోవునపుడు తమ పండ్లతో కరచిపట్టి తీసికొనిపోవును. మరియొక్క విధముగా తీసికొనిపోజాలవు. బుట్టను నీవు నీచేతిలో పట్టుకొనిపోదువుగదా. అయితే కుక్క దానిని తన పండ్లచే పట్టి తీసికొనిపోవును.

ఆవులు గుఱ్ఱములు గడ్డినిగాని చొప్పనుగాని ఎట్లు త్రుంచి తినునో గుర్తించితివా? అవియు తమ పండ్లను త్రుంచుటకు నుపయోగించును. వాని పెదవులుకూడా దేనినైనను నోటిలోనికి తీసికొనుట కుపయోగపడును. పెదవు లందుకుమాత్రమే గాక; మనమెట్లు చేతితో వస్తువులను తాకి తెలిసికొందుమో, అట్లే అవియు, వస్తువులను తాకి తెలిసికొనుటకు వాడును.

ఒకసారి ఒక గుఱ్ఱము గడ్డిమేయుచు, కొంతగడ్డిని వ్రేళ్లతో కూడ పెళ్లగించెను. అది దానిని తినుచుండగా, ఆ వ్రేళ్లకున్న మట్టి నోటికడ్డమువచ్చెను. గనుక అది ఆ గడ్డిని పండ్లతో గట్టిగాపట్టుకొని నేలపైగొట్టి, మన్నంతయు పోయినపిదప గడ్డిని తినెను.

కోతులు చిత్రమైన జంతువులు. చేతులవంటివి నాలుగు వానికున్నవి. అవి చేతులుగావు, పాదములుగావు, రెంటికి

మధ్యస్థముగానున్నవి. వీనితో నవి బహు త్వరగాను, తెలివిగాను చెల్లెక్కును. మరికొన్ని కోతులకు పెద్దతోకలుండును. వాటి నవి అయిదవచేతిలాగు నుపయోగించును.

పిల్లి తన పాదములను, పండ్లను చేతులకుమారు ఉపయోగించును. ఎక్కవలసి వచ్చినప్పుడు తన గోళ్లనువాడును. చుంచులు ఎలుకలుమొదలగు వానిని వాటితో పట్టుకొనును. కోపము వచ్చినప్పుడు పిల్లలవలె పంజాతోకొట్టును. తన పిల్లల నెక్కడికైనను ఎత్తుకొనిపోవునపుడు నోటితో బట్టుకొని వెళ్లును.

ఉడుత ఏదైనా తినునపుడు, దానిని తన ముందుకాళ్లతో పట్టుకొని తినును.

పక్షులు చేతికిబదులు నాలుక నుపయోగించును. దానితో తమ ఆహారమునేరి, లోపలికి పంపును. బాతునాలుక చిత్రమైనది. అది బురదలోను నీళ్లలోను ఆహారముకొరకు వెదకును. దేనిని తినుచున్నదో దానిని చూడలేదుగనుక, దాని నాలుకకు తాకిచూచెడి శక్తిగలదు. అది నోటినిండ నీరుగాని బురదగాని తీసికొనగానే, దానికి కావలసినవాటిని నాలుక తాకి తెలిసికొనును. వెంటనే పనికిరాని వాటినన్నిటిని బైటకు నెట్టివేయును.

(సశేషము)

C. L. S. PRESS, MADRAS—1918